తన బొమ్మ నవహరించినవానికి దండము లేకయుండుట లలితకు సంతుష్టి లేక "అన్నా! నీవు మాటలలోఁబడి నామా మఱచిపోయితివా?" అనియెను.

భవా—లలితా! అదిగో! చూడుము! నీబొమ్మవచ్చు చున్నది.

లలిత తిరిగి చూచెను. జనార్దనుఁడు రాజకుమారు నెత్తుకొ వచ్చుచుండెను. రాజకుమారున కిప్పుడు రెండవయేఁడు, సరిగ దం పోలిక! లలిత యొక్కపరుగునఁబోయి యాబిడ్డ నెత్తికొనియెన దేవలుఁడును జేయిచాచెను గాని, పినతల్లిని వదలి యా పసిబి పినతండ్రియొద్దకుఁ బోవఁడయ్యెను. అప్పుడు లలిత "మీరు న బొమ్మనికిఁ బాఱవైవరుగద? ఆనేరమునకే యీబిడ్డ మీయొద్ద వచ్చుటలేదు" అనియెను.

అంతలో లలితకుఁ దనగొరువంక యగుపడుటచే బిడ్డను రా యొడిలోనుంచి పరుగెత్తెను. భవానీప్రసాదుఁడు రాణియొడినుం కుమారునిఁ దీసికొని ముద్దుపెట్టుకొనియెను. అప్పు డాతఁడు పులకి శరీరుఁడై "ప్రియా! దైవానుగ్రహమున మనమెంత ధన్యులమై అనియెను.

ఉమా—ఆహా! ఈసమయమునఁ బ్రమదయే యున్నయెడ నెంతబాగుగ నుండును.

భవా—ప్రాణేశ్వరీ! సత్యము చెప్పితివి. ఇప్పుడు ప్రమద యున్నచో—

ఉమా—ప్రమద మనప్రక్కలనే తిరుగుచున్నదని నా నమ్ కము. ఆమె నిన్నువిడిచి స్వర్గమునందైన నుండఁజాలదు. ఆ మరల వచ్చును. నా గర్భమున జన్మించి నీసంబంధమును గలుగ జేసికొనక మానదు. మన గాఁడుబిడ్డ పుట్టినచోఁ బ్రమదపేరు పె వలయును.

సమాప్తము.

కాకినాడ: జార్జిప్రెస్‌యందు ముద్రితము—1948. (1000 కాపీలు)